

# శ్రీజనార్ధన శతకము




గ్రంథకర్త

బులుసు వేంకటరామమూర్తి,

...ష్టావధాని

...యనగరం.





1957





[వెల రు. 0–8–0
(50 నయాపైసలు)

ఓమ్

శ్రీరస్తు

శుభమస్తు

అవిఘ్నమస్తు

శ్రీశారదాంబాయైనమః

# శ్రీ జనార్దన శతకము



గ్రంథకర్త

బులుసు వేంకటరామమూర్తి

అష్టావధాని.

విజయనగరం





[ వెల **0–8–0,**

**50** నయాపైసలు.



కృతికర్త

బులుసు వేంకటరామమూర్తి

అష్టావధాని

విజయనగరం.

# కృతిసమర్పణము



పదములు తోట్రుపాటుఁబడు
ప్రాయము చిన్నది లేవలంకృతుల్
ముదమగు మాటతీఱు రస
ముందగు భావ మెఱుంగ దింత నీ
పదమె శరణ్య మంచు నెద
భావన సేయు భవత్కృపా సుసం
పద నెటు పెద్ద జేసెదవో
మత్కృతి కన్యక నో జనార్దనా.

# తొలిపలుకు

పాఠకమహాశయులారా! బాలుఁడనై సాహిత్య క్షేత్రమున మిక్కుటమగు పరిశ్రమ లేకపోయినప్పటికి బుధ జనాశీర్వాద బలముచేతను శ్రీ శారదా వరప్రసాదలబ్ధ కవితాధారచేతను ఆ జగద్రక్షకుఁడగు పరాత్పరుని వినుతింప ననుకూలమగుననియెంచి యీ చిన్నిపొత్తమును రచింప సాహసించితిని. మదీయకవితాధారను ప్రోత్సహించి దోష లేశములను సవరించిన మాడుగుల వేంకట సూర్యప్రసాదరావు శతావధానిగారికిన్ని గ్రంథ మాసాంతము చదివి లోపముల సవరించి తమతమ సదభిప్రాయాశీర్వచనముల నొసంగిన కవి శేఖర పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి చింతలపూడి సన్యాసి రావు ఆకుండి వేంకటశాస్త్రి త్యాది పండిత ప్రకాండు లకును ధన సహాయ మొనర్చి గ్రంథము వెలువరించిన రసజ్ఞ శిఖామణులకును ముద్రణా వ్యయము భరించిన వేంకట్రామ్ అండ్ కో యజమానులు శ్రీ యీదర వేంకటరావు పంతులుగారికినీ స్వల్ప వ్యవధిలో గ్రంథము సుందరముగ తయారుగావించిన ఆంజనేయ పవర్ ప్రెస్ వారికిని సహృదయమున ప్రోత్సాహ మొసంగి నన్ను ఏలూరులో పెద్దలకు పరిచయం గావించిన సాహిత్యమండలి అధ్యక్షులు డాక్టరు శంకర శ్రీరామారావుగారికినీ, ముద్రణా స్ఖాలిత్య నివారణాభారము వహించిన, కవిమిత్రులు శ్రీ అద్దేపల్లి కుటుంబరావు గారికినీ నా హృదయ పూర్వక నమోవాకముల నర్పించుచున్నాను. సహృదయులు రస గ్రహణ పారీణులు పితృకల్పులు నగు యావదాంధ్రులు నా యీ సారస్వత సేవను మన్నించి యాశీర్వదింతురుగాక.

ఇట్లు విద్వజ్జన విధేయుడు,

కృతికర్త.

# పరిచయ వాక్యములు

కవితాభూషణ, విద్వాన్ : వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

బ్రహ్మశ్రీ బులుసు వేంకటరామమూర్తిగారు రచించిన జనార్దనశతకములోని కొన్నిపద్యములువినుటయే కాక నేటి శంకరజయంతి సభలో వీరాశువుగా చెప్పిన పద్యములు విను భాగ్యముకూడఁ గలిఁగినది.

ఆశువుగా చెప్పిన పద్యములుకూడ ఆలోచించి రచించిన వానిని మించియుండుట అద్భుత మనిపించినది. గంగా ప్రవాహమువంటి ధారలో లలిత పదమంజులము సరసమునగు కవిత్వముచెప్పు వీరి ప్రతిభావిశేషము నుత్యము. వీరు అవధానములందు దారి తేఱినవారని తెలిసినది.

వీరి నిరంతర కవితా రూపసేవ ఆంధ్రసరస్వతికి సర్వతోముఖ పుష్టినొసంగగలదని ఆశించుచు పరమేశ్వరుఁడు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక యని ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు,

4-5-57.

(Sd.) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
తెలుగు పండితుఁడు.
శ్రీ. కో. భా. రా. కళాశాల
అమలాపురము.

# ఆశీస్సు

## విద్వత్కవి ఆకుండి వేంకటశాస్త్రిగారు

విశ్రాంత సంస్కృత కళాశాలాంధ్ర పండితులు

విమలంబౌ బులుసన్వయంబు కవితావిద్యామహీయః పరి
శ్రమపిత్రర్పిత సాహితీకళ స్వభాషాశక్తియుంగల్గి భ
క్తిమెయిన్ శ్రీహరిసద్గుణమ్ములకు నేకీభావముంగూర్చి తా
నమిత ప్రజ్ఞనుఁజూపి వ్రాసె శతక మ్మార్య ప్రశంసార్హుఁడై

తే. గీ. తనరువృత్తమ్ములను జనార్దనశతకము
వ్రాసె నీ బాలకవి మృదుపాకమలర
నట్టి వేంకటరామమూర్త్యాహ్వయుఁడు చి
రాయు రారోగ్యములుగల్గి యలరుగాక

ఇట్లు,

శ్రేయః కాంక్షి

(Sd) ఆకుండి వేంకటశాస్త్రి

# ఆ శీ ర్వా ద ము

సాహిత్య విద్యాప్రవీణ ఉభయభాషాప్రవీణ కవిశేఖర

## పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు

మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాలాంధ్ర పండితులు

తే. గీ. జనుల నర్దించుటను జనార్దన సమాఖ్యఁ
గనిన పరమాత్మ శతక యుక్తిని భజించి
మంజులోత్సాహ సూక్తి సంపద వెలార్చె
బులుసుజుండు వేంకటరామమూర్తి సుకవి.

సంకలితార్థ శబ్ద విలసత్ గుణభావ రసప్రశస్త కా
వ్యాంకితవృత్తిఁ గూర్చుచు జనార్దనుఁ డాశ్రిత పక్షపాతి శ్రీ
వేంకటరామమూర్తిని కవీంద్రుఁడుగా కృతిగా యశస్విగా
జంకును గొంకులేని బుధచంద్రుఁడుగా వెలయించి ప్రోచెడిన్

ఇట్లు,
శ్రేయోభిలాషి,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

# అభిప్రాయము

కవిశేఖర: అడిదము రామారావు పంతులుగారు
మహారాజాంగ్లకళాశాలా విశ్రాంతాంధ్ర పండితులు, విజయనగరం.

చిరంజీవి బాలకవి అష్టావధాని బులుసు వేంకట రామమూర్తిగారు రచించిన జనార్దనశతకములోని కొన్ని పద్యములు తామే స్వయముగ చదివి వినిపింపగా విని మిక్కిలి సంతసించితిని. వీరు బాలకవి పదముచే నిపుడు వ్యవహరింప బడుచున్నను భావిలో ప్రౌఢకవి యగునట్టి లక్షణము లీయన కవిత్వమునందు గానవచ్చుచున్నవి. పద్యములశైలి ధారాళమై ప్రవాహ వేగతుల్యమై యలరారుచు భక్తి విలసితమై కర్ణపేయముగ నున్నది. బులుసువారి కుటుంబము విఖ్యాత పండితవంశము; దానికి తోడు యీ యువకునకు ప్రాక్తనపుణ్య విశేషమున చక్కని కవితాధారయలవడినది ఇది కేవలము దైవదత్తము. నాకు పరమపూజ్యులును శతాధిక గ్రంధకర్తలును కవిసార్వభౌములును నగు శ్రీపాదకృష్ణ మూర్తిశాస్త్రిగారే యీబాలకవిని ప్రశంసించుచు నాశీస్సుల నొసగిన కారణమున నస్మదాదులు ప్రత్యేకముగ వీరి కవిత మగ్గడింపనక్కరలేదు. శ్రీరామచంద్రుని కృపాగరిమముచే నాయురారోగ్యైశ్వర్యములు గల్గి యితోధికభాషా సేవ జేయుచు తన వంశమునకు వన్నెబెట్టుగాక యని మిక్కిలిగా గోరుచున్నాడను.

విజయనగరం,
19–3–54

ఇట్లు,
(Sd) అడిదము రామారావు.

కవితాకోవిద, చింతలపూడి సన్యాసిరావుగారు
కౌముదీ పరిషత్కార్యదర్శి.

బులుసు కులావతంస! గుణభూషణ! వేంకటరామమూర్తి! యా
పలుకువెలంది త్వద్రసనవాస మొనర్చి మనోజ్ఞ భావనా
కలిత కవిత్వ మాధురులఁగ్రాలు జనార్దననామ కోత్తమో
జ్వల శతకంబు నాంధ్రజనపాళి కొసంగె ననూన సత్కృపన్.

విజయనగరం,
4—5—5

ఇట్లు,
(Sd.) చింతలపూడి సన్యాసిరావు

---

సాహిత్యకోవిద : క్రొవ్విడి రామం, B. A. B. L. B. Ed.
బోర్డుహైస్కూలు
పార్వతీపురం

వర్ధమానకవి శ్రీ బులుసు వేంకటరామమూర్తి గారిచే రచింపబడిన జనార్దన శతకములోని కొన్నిపద్యములు కవిగారి ముఖమున వినియున్నాను. మధుర మంజులశైలితో నలరారు భక్తిభావముగల యీపద్యములు ప్రసాదగుణముతో నొప్పారు చున్నవి. యీ శతకము సహృదయ హృదయాహ్లాదకరముగా నుండగలదని నా నమ్మకము. వాగ్దేవత వీరికి సర్వదా శుభము లొనగూర్చుగాత.

పార్వతీపురం,
4—5—57.

ఇట్లు,
(Sd.) క్రొవ్విడి రామం.

కవిభూషణ పౌరాణిక కోకిల కాలక్షేప కంఠీరవ భాషాప్రవీణ అండ్ శిరోమణి

శ్రీమాన్ అద్దంకి వేంకటరంగాచార్యులుగారు

సంస్కృత పండితులు

B. P. M. M. హైస్కూల్, విజయనగరం.

జాతి రత్నంబులను బోలుచంపకాది
పద్యములతోడ బహుళార్థ పటిమ వెలయ
నలజనార్దన శతకంబు కలితభక్తి
ఘనతగూర్చితి బుల్సు వేంకటకవీంద్ర

అలమందార మరంద బిందులహరీ వ్యాపారమే పారగా
విలసన్నవ్య కవిత్వధారను సదావిఖ్యాత శక్తిన్ మనం
బులురంజిల్ల జనార్దనాఖ్య శతకంబున్ గూర్చి నావోకవీ!
జలజాక్షుండిలనిన్ను బ్రోవుత మహైశ్వర్యంబు సంధిల్లగన్.

ఇట్లు,

(Sd.) అద్దంకి వేంకటరంగాచార్యులు.

హరిదాసభూషణ, మరింగంటి లక్ష్మణాచార్య భాగవతార్
భీమునిపట్టణము

అష్టావధాని బులుసు వేంకటరామమూర్తిగారిచే రచింపబడిన జనార్దనశతకము నేనాసాంతము చదివి యానందించితిని. ఇందలి ప్రతిపద్యము రసస్థానము నలంకరించి వేదాంత ప్రబోధము చేయుచున్నయది. వీరి కవితాధార దివిజగంగాతరంగాలతో చెలిమి చేయుచున్నయది. వీరి నిర్దుష్టా ష్టావధానమాంధ్రావనిలో విజయధ్వజ మెత్తియున్న యది. ఈ శతకములో శబ్దాడంబరముతక్కువ. అర్థాడంబ రము మెక్కువ. ఆంధ్రావని వీరికవితా లతాంగికి జాళువా మేలి ముసుంగులల రించి మహోన్నతస్థితి చేకూర్చుగాత.

ఇట్లు,
ఆ. మరింగంటి లక్ష్మణాచార్యులు.

---

విద్వత్కవి సార్వభౌమాభినవపండితరాజ విద్యావాచస్పతీత్యాది
దశ బిరుదాంకితులు
పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు,
ముంగండ.

అష్టావధాని బులుసు వేంకటరామమూర్తి కవివర్యులు రచించిన జనార్దన శతకమును స్థాలీపులాకన్యాయముగ విమర్శించిచూచితిని. ఇటభక్తిరసము కెరటములతో ప్రవ హించుచు హృదయాకర్షముగానున్నది. శ్రీవాణీ కరుణా కటాక్షమున వీరు సత్కవిలోకమున వన్నెకెక్కుదురుగాక.

మారుటేరు,
12-3-55

ఇట్లు,
(Sd) పుల్య ఉమామహేశ్వరశాస్త్రి.

మధురకవి : మూలా పేరన్నగారు
బిలాన్‌పూర్.

బులుసుకుల ప్రవీణ కవి పుంగవ
వేంకటరామమూర్తి! యు
జ్జ్వలతర భావ సంపదలు
జాలగగల్గ జనార్దనార్యుపై
కలిత మృదు క్తులందు శత
కంబు రచించి మనోజ్ఞవాగ్వధూ
గళమున కంఠహారముగ
గారవమార నలంకరింపవే.

ఇట్లు,

8-4-57

మూలా పేరన్న.

# విజ్ఞప్తి

మహాశయులారా !

నేనీ గ్రంథమురచించి సుమారు నాలుగు సంవత్సరములు కావచ్చినది. ఆర్థిక పరిస్థితులు అనుక్షణము అంతరాయము కల్గించుచున్నందున ముద్రణచేయుటకు సదవకాశములేక గ్రంథము త్వరలో ఆంధ్ర రసజ్ఞలోకమునకందింపలేకపోతిని. ఈ దిగువ పేర్కొనబడిన మహనీయులెల్లరు భక్తి పూర్వకాభిమానమున సహకరించుటచే ముద్రణ జరిగినది. వీరినెల్లరిని యీకృతి భర్తయగు జనార్దనుడిష్టకామ్యార్థసిద్ధులొసంగి రక్షించుగాక.

ఇట్లు,

కృతికర్త.

1. బొడ్డు సీతారామస్వామి శ్రేష్ఠిగారు — విజయనగరం
2. పసుమర్తి వీరభద్రస్వామి B. A. గారు — విజయనగరం
3. పూసపాటి మాధవవర్మగారు — జొన్నవలస
4. పూసపాటి లక్ష్మీనరసింహరాజుగారు — జొన్నవలస
5. Dr. బెండపూడి వేంకటరాజుగారు M.B., B.S. — విశాఖపట్నం
6. సురవరపు కామినాయుడుగారు — సురవరం
7. గూడూరు సన్యాసిరాజుగారు — విజయనగరం
8. దాకోజు లింగమూర్త్యాచార్యులుగారు — నగరికటకం
9. కలగర్ల సూర్యనారాయణశ్రేష్ఠిగారు — విజయనగరం
10. కొత్తా యమునయ్య శెట్టిగారు — విజయనగరం

11. నారాయణం విశ్వనాథంగారు విజయనగరం
12. మగటపల్లి నరసింహమూర్తి సోదరులు శ్రీకాకుళం
13. మాటూరు సూర్యప్రకాశంగారు B. A. విజయనగరం
14. కామాక్షీ భక్తసమాజంవారు విజయనగరం
15. రవిరత్న కంపెనీవారు విజయనగరం
16. శ్రీకాశీభట్ల శ్రీమహావిష్ణుమూర్తిగారు మచిలీపట్నం
17. ఉదయగిరి సీతారామస్వామిగారు విజయనగరం
18. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు
రాజమహేంద్రవరం
19. సుసర్ల వెంకటరావుగారు, L. M. & S. విజయనగరం
20. వెదురుమూడి వేంకటరావుగారు విజయనగరం
21. నార్కెడమిల్లి వెంకటగంగరాజుగారు గజపతినగరం
22. అప్పసాని అప్పన్న దొరగారు చైర్మన్ విజయనగరం
23. అక్షింతల సత్యనారాయణగారు విజయనగరం
24. బొడ్డు అప్పారావుశ్రేష్ఠిగారు విజయనగరం
25. M. మోహనరావుగారు, S. K. M. & E. Works.
విజయనగరం
26. పిళ్లా రంగనాయకులుగారు విజయనగరం
27. దారా నమశ్శివాయగారు విజయనగరం
28. మింది వేణుగోపాలరావుగారు విశాఖపట్నం

# జన్మభూమి

సీ. ఘన పౌరుషంబుచే ఖడ్గంబుదూసిన
వెలమల్ జనించిన వీరభూమి
మాటకు పద్యంబు మహిమతో చెప్పెడి
బాల కవీంద్రుల వాసభూమి
నిరతంబు శాస్త్రముల్ పరిశోధనలఁజేయు
శాస్త్రజ్ఞులకు నెల్ల జన్మభూమి
గడియకు నొకవేయి కార్యముల్ జరిపించు
వైశ్యుల కెలమి సం వాసభూమి

తే. గీ. వీరబొబ్బిలి యనుమేటి పేరుఁగాంచి
దొరలకావాసమైయున్న దురితహర
మట్టిపురమందు జననంబు నందినట్టి
బాలకవి వేంకటాఖ్యుండఁ బ్రణుతిసేతు.

## వంశము

తే. గీ. యాగములనింపి భువిసోమయాజి బిరుద
మంది యాచారగౌరవ మాదిగల్గు
గుణములకు నాస్పదంబయి కూర్మినొప్పు
బులుసు వంశంబులోపల వెలయువాడ.

---

# నివాసము

సీ. సకలవిద్యలయందు సారముల్ గ్రహియించు
కవివరేణ్యుల నెల్లఁగన్నభూమి
సరససంగీతాంగ్ల సంస్కృతో న్నతకళా
శాలల కెల్లను స్థావరంబు
వాణిజ్య భాగ్యసంవర్థకశీలురా
వైశ్యకోటికి సదావాసభూమి
మహివిశాఖాహ్వయ మండలంబున చాల
ప్రతిభగల్గినయట్టిపట్టణంబు

తే. గీ. కవిజనాళికి బుధులకు గాయకులకు
నధిక విద్యాధికుల కెల్ల నాస్పదంబు
లలితకళలకు లక్ష్మికి నిలయమైన
విజయ నగరాఖ్యపుర మునవెలయువాఁడ.

---

## శా ర దా స్తు తి

చ. తలఁపఁగ నీకృపాబ్ధి కవితాకళనొందినవాఁడ నేడునిన్
దలఁచి మనంబులోన కడుధైర్యముతో విరచించుచుంటి నే
కలమును చేతబూని శతకంబు పరాత్పరు సన్నుతింప నో
పలుకులరాణి నన్ను పరిపాలనఁ జేయ నుతింతు నిన్నెదన్

## వి ఘ్నే శ్వ ర స్తు తి

క. పరమ ముదంబున శతకము
విరచించెడి కాలమందు విఘ్నహరుండై
కరుణామతి ననుఁగావఁగ
కరిముఖు గౌరీకుమారు గణుతింతు నెదన్.

## గు రు స్తు తి

తే. గీ. ఉభయభాషా ప్రవీణుఁడై సభలయందు
కీర్తిగాంచియు సద్గుణవర్తియగుచు
జనకుఁడై నాకు విద్యాప్రశస్తిఁదెల్పు
బులుసు నరసింహశాస్త్రినిఁ దలఁతు మదిని.

## క వి స్తు తి

తే. గీ. కాళిదాసాదులౌ పూర్వకవులఁ దలఁచి
నేటి కవులకు నంజలి నిర్మలమతిఁ
గూర్చి; శతకంబు వ్రాసెద కూర్మిమీఱ
తప్పుల క్షమింపుడయ్యాఁ తత్త్వజ్ఞులార !

# కృతజ్ఞత

ఇందుసహాయముచేసిన ఉదారులధనము ఫోటోబ్లాకులకు పేపరుకు మొదలగు ఖర్చులకు సరిపడినది. దానిని పురస్కరించుకొని ముద్రణావ్యయమంతయు భరించి నా గ్రంథము వెలువరించిన ఏలూరు వాస్తవ్యులును వేంకట్రామా అండ్ కో ప్రొప్రయిటరుగారునగు శ్రీ యీదర వేంకటరావు పంతులు గారికి హృదయపూర్వక కృతజ్ఞతా వందనముల నర్పించుచు వారికుటుంబమును సర్వదా యీ కృతిభర్తయగు జనార్దనుఁడు రక్షించుగాక యని కోరుచున్నాను.

చ. కరుణదలిర్ప నాదు శతకంబును ముద్రణసేయు భారమున్
ద్వరవహియించి శ్రీహరి పదంబుల గొల్చెడి భక్తవర్యు నీ
దరకుల వంశ వార్ధివిధు ధన్యుని వేంకట రాయధీమణిన్
హరినిరతంబు బ్రోవుత మహత్తర సౌఖ్యములిచ్చిసత్కృపన్

ఇట్లు,

కృతికర్త.

# శ్రీజనార్దన శతకము



శ్రీరమణీమణీవిమల చిత్తనివాస! వికర్మదుష్క్రియా
వారనిరాస! సద్విషయవర్గవిలాస! మణీవికాస! వి
స్ఫారకృపాభిరక్షిత నిజస్మరణస్థితిదాస! భవ్య శృం
గారగుణాభిలాష! ననుఁగావు మనంతకృపన్ జనార్దనా. 1

శ్రీరమణీయహార! శ్రితచిత్త సరోరుహసద్విహార! వి
స్తారకృపారసావిత నిశస్తగుణాంచితమా నివార! దు
ర్వారజగద్వ్యథాకరణ రాక్షసలోక నివార! సౌమ్య శృం
గార! నిజాంఘ్రిభక్తు ననుగావు మపారకృపన్ జనార్దనా. 2

తరణము, దుర్భవాబ్ధికి కృతాంత నితాంతనిపీడనైక సం
హరణము, సద్గుణాంచిత నిజాశ్రితలోకశిరః ప్రభాసితా
భరణము జ్ఞానయోగ విభవైక కళాకరణత్వదీయ సం
స్మరణముసల్పుభాగ్యమునొసంగుమనంతకృపన్ జనార్దనా. 3

పరమదయానుషంగ! పరిపంథివితానక గర్వభంగ! సుం
దరతరభాసితాంగ! భవతాపవిహీనజన ప్రసంగ! భా
సురజలజాలయా హృదయ శోభితభృంగ! మనీషిసంగ! సం
గరతలచంగ! రంగ! ననుగావుమనంత కృపన్ జనార్దనా. 4

సలలితతావకీన పదసారస భక్తిరహింప చంపకో
త్పలశతపద్యమాల నిడెదన్ కృపమీఱ గ్రహింప చంపకో
త్పలసుమమాలఁబోలె శుభదాయక ! శ్రీకమలాధినాయకా !
నళినభవాది దేవగణనాయక ! పాయక నోజనార్దనా. 5

చదువఁగ లేదు కావ్యములు శాస్త్రములాదిగ గల్గు గ్రంథముల్
సదమలతావకీనకృపచాలగ నాయెడఁ గల్గియుంట కో
విదనిచయ ప్రశంసఁ గడు విశ్రుతిఁగన్న కవిత్వధార ని
ట్లుదితములైన పద్యములనోలి గ్రహింపుము శ్రీజనార్దనా. 6

కోరఁగ లేదు సంపద లకుంఠిత రాజ్యరమాభిషేకముల్
కోరఁగ లేదు నిన్ను మునికోవిదసన్నుత భావమందు వి
స్ఫారభవత్పదాబ్జముల సన్మతిఁ గోరెద నిత్యమాత్మ నో
సారసనాభ నన్ను ననిశంబు దయంగను మోజనార్దనా. 7

దానము సేయ శక్తి సరి తావక సంస్మరణంబు సేయగా
పూనికయున్ హుళక్కి నిను పూజనొనర్పఁగ నిర్మలత్వమున్
మానసమందు శూన్యమగు మానవజన్మము నెత్తినాడ నో
దీనశరణ్యా నాకిలను దిక్కు నినమ్మితి నిన్ జనార్దనా. 8

సారవిహీనమైకడునసాధ్యముగొల్పుచునున్నయట్టి సం
సారములోనఁజిక్కి మనసారనినున్ భజియింపలేక వి
స్తారవిపత్తులంబడుచు దారినిగానఁగ లేని యట్టి న
న్నారసి సత్పథార్థముల నందఁగ జేయుమిలన్ జనార్దనా 9

చిన్నతనానమిత్రుఁడుకుచేలుఁ డపారదరిద్రబాధచే
నెన్నొ విపత్తులంబడుచు నెంతయునిన్నొకసారిఁ జూడ నా
పన్నశరణ్య వానికతివైభముల్ సమకూర్చినావు నిన్
సమ్మతిసేయువారల కసాధ్యములుండునె శ్రీజనార్దనా. 10

ఇమ్మగనాకరీంద్రము యథేచ్ఛసరస్సున కేగనీటికై
యమ్మకరంబుబట్టి బలమారఁగనెంతయు బాధపెట్ట ధ్యా
నమ్మొనరింప నాకరి ననంత కృపామతినేలినావు నిన్
నమ్మినవారికెన్నటికి నాశములేదుగదా జనార్దనా. 11

సరగచరాచరంబు లనిశంబుదయాదృతిమీఱ నేలి స
త్వరమును సర్వకామ్యపరిపాక గతింబొనరించి నిత్యమున్
పరమవివేకశీలమున ప్రార్థనఁజేసిన భక్తసంతతిన్
తిరముగరక్షసేయు మహనీయగుణోత్తర శ్రీజనార్దనా. 12

భారత యుద్ధరంగమున పాండవమధ్యముఁ డర్జునుండు వి
స్ఫారభవత్సహాయము శుభస్థితి కోరగ సమ్మతించియున్
సారథివై రణంబున కసమ్మతుఁడై జనునట్టి క్రీడికిన్
నేరిపినావుతత్త్వపథనిర్ణయమోర్పుమెయిన్ జనార్దనా. 13

ఖలుఁడగు దుస్ససేనుఁ డధికారమదంబున మానభంగమున్
సలుపఁగనెంచ ద్రౌపది కనంతకృపానిధివైన నిన్ను నా
లలన స్మరించినంతనె చలంబున నక్షయమంచు నామెకున్
వలువలొసంగినట్టి సురవందిత నన్ గను శ్రీజనార్దనా. 14

జాలములేక భక్తజనసంతతినెల్ల దయావిశేష లీ
లాల సమానవై భవ విలాసమునన్ కరుణించి నిచ్చలున్
చాల శుభాళిగూర్చు నిను సంతతమర్చనఁ జేతునామదిన్
పాలనసేయుమయ్యా! సురపాలక! సత్కృప నోజనార్దనా. 15

నీమము నిష్ఠగల్గి యతి నిర్మలభక్తిని గొల్చుదీనులన్
ప్రేమను సంతతంబు పలురీతులఁ బ్రోచి చెలంగునట్టి నీ
నామము సంతతంబు భవనాశనమంచు నుతింతునాయెదన్
సామజరక్షకా! దయనుసాకుము నన్నిల నోజనార్దనా. 16

భావమునందు నిర్మలతభాసిల సంతతమొక్కరీతి నీ
పావనమైననామము జపంబునొనర్పఁగ దీక్షనిచ్చి యో
దేవ! మదీయపాపముల దిగ్గునమాయముఁజేసి సత్కృపన్
కావుము నన్ననారతము కంజదళాక్ష! హరీ! జనార్దనా. 17

పరమునెరుంగలేక క్షణభంగురమై విలసిల్లు ప్రాణముల్
స్థిరములటంచునెంచి పరిశీలితబుద్ధినిలేక పాపముల్
నెరపుచునున్నమూర్ఖులకు నీతిరవంతయునైన గల్గునే
పరమదయాకరా! పతితపావన! ధీజన! శ్రీజనార్దనా. 18

జానెడుపొట్టకై మది విచక్షణనించుకలేక నిత్య మ
జ్ఞానముతోడ పాపముల సల్పుచునుందురు ముందుదుర్గతుల్
గానక నీదుదివ్యపదకంజములన్ భజియించునిచ్ఛనే
బూనరు వ్యర్థకార్యములఁ బుత్తురుకాలము నోజనార్దనా 19

జీవితమస్థిరంబనుచు చిత్తమునందు నెరింగియుండియున్
భావమునందహంకృతిని భాసిలియెల్లరుమూఢచిత్తులై
తావకపాదపద్మములెదన్ భజియింపక కష్టజాలమున్
భూవలయంబునందుగని పొక్కుచునుండిరి శ్రీజనార్దనా 20

తలఁచెద దీక్షతోడుతను తావకనామము సంతతంబు నే
గొలిచెదనీపదంబుల నకుంఠితభక్తిదలిర్ప నామదిన్
పిలిచెదతృప్తిదీర నరిభీషణ పాహిముకుందయంచు నే
వలచెద నీదుభక్తజనవర్యుల స్నేహము నోజనార్దనా. 21

సారములేనిమాట సరసజ్ఞులుమెచ్చనిపాట యాయుధా
ధారములేనివేట నినుఁదప్పక గొల్వనిపూట కావ్య సం
స్కారములేనిపేట ఫలసాయములేనటువంటితోట ని
స్సారములౌనుగాదె సురసన్నుతసచ్చరణా జనార్దనా. 22

అతిథులపూజసేయని గృహస్థుఁడు భర్తనుభక్తితోడుతన్
సతతముగొల్వనట్టిసతి సంతత పుష్కలభాగ్యవంతుఁడై
వితరణలేని మానవుఁడు విద్యనుగల్గియుతావకీనస
న్నుతి నొనరింపనట్టి కుజనుండును వ్యర్థులు శ్రీజనార్దనా 23

కాటికికాళ్ళుచాచికొని గర్వముతో స్థిరమంచుజీవితం
బాటలలోవిలాసముల నత్యధికంబున పూర్తిచేసి నీ
పాటలు నామమంత్రముల భక్తిదలంపక నూతనంబులౌ
నాటక వేషభాషలకునై ముదమందెద రోజనార్దనా. 24

ఖలుఁడగు సోమకాసురుఁ డెకాయెకి కూళతనంబుచేత నా
తొలి పలుకుల్ హరించి యలతోయధియందున డాగియుండగా
నలయక మత్స్యమూర్తివయి యాదనుజున్వధియించి వేదముల్
నలువకొసంగినట్టి భవనాశన! కేశవ! శ్రీజనార్దనా. 25

స్థిరమతి దేవదానవులు క్షీరపయోధి సుధాభిలాష మం
దరగిరితోమథింప గిరిదబ్బున సాగరమందు మున్గ స
త్కరుణను కూర్మరూపమును దాల్చి ధరాధరమెత్తినారలన్
నిరుపమసత్కృపన్ గనిన నిర్మలమూర్తివి శ్రీజనార్దనా. 26

అలకనకాక్షుఁ డీధరణినంతయుఁ జాపగఁజుట్టి క్రూరతన్
గలతనుబెట్ట నీవుకరుణామతివౌచు వరాహరూపము
జ్వలమతిదాల్చి తక్షణము వాని వధించి జగంబునందు స
త్ఫలము నొసంగినట్టి శుభదాయక! నన్గను మోజనార్దనా.

తనయుఁడు శ్రీహరీయనుచు ధ్యానమొనర్పగ వానినెన్నియో
ఘనమగు కష్టవార్ధుల నఖండ కృధామతి ముంచి దుర్మదం
బున విలసిల్లు హేమకశిపున్ వధియింపగ నెంచి నీమదిన్
కినుక వహించితౌర! నరకేసరి రూపున నోజనార్దనా. 28

బలమున పాకశాసనుని భాసురరాజ్య పథంబు గొన్న యా
బలి దనుజేంద్రుదర్పమును భంగమొనర్పఁగ వామనాకృతిన్
వెలసి పదత్రయోర్వి నతినేర్పున గోరి సురద్విషేంద్రునిన్
సలలిత మొప్పబంపితి రసాతలసీమకు నోజనార్దనా. 29

ఇరువదియొక్కమారు ధరణీశ్వర వర్గము సంహరించి భా
సురబల పౌరుషంబులను శోభిలుచుండెడి కార్తవీర్యునిన్
దురమున సంహరించి పలుదుష్టుల పీచమడంచి ధాత్రి సం
బరమునుగూర్చినావు గద! భార్గవరాముఁడవై జనార్దనా. 30

జలజభవుండు దేవతలు సంఘముగా జనుదెంచి నీదరిన్
ఖలుఁడగు రావణాసురుని క్రౌర్యము లెల్లను విన్నవింపగా
వెలయ నయోధ్యనేలు పృథివీపతి పంక్తిరథాత్మజుండవై
వెలసి దశాస్యుఁజంపి పృథివీతలమేలిన శ్రీ జనార్దనా. 31

ఖలజన శిక్షణంబుకడుక్రమగతింబొనరించి శిష్టులన్
విలసిత సత్కృపామతి భువిన్ పరిరక్షణ సేయనెంచియున్
హాలమునుచేత బూని జగమందున శ్రీ బలరామమూర్తివై
చెలగితివౌర సర్వసురసేవిత సచ్చరణా జనార్దనా. 32

ధరణినహింసయున్నిజ ముదారతతో నెలకొల్ప నీమదిన్
కరుణ దలిర్పఁగా దలఁచినవ్యరసార్ద్రి పునీతబుద్ధివై
పరమకృపాంతరంగమున భాసిలి నావలబుద్ధమూర్తివై
సురమునిసేవితాంఘ్రియుగజూడుమునన్కరుణంజనార్దనా. 33

పాలిత దుర్జనత్వమున భాసిలు ఘోరమదాంధ బుద్ధులన్
బాలిశులన్ వధింపగ మనంబున నెంచి యమేయపాప ని
ర్మూలముచేసి లోకమున రూఢిగ శిష్టుల నేలబూనియున్
గాలితివౌర! శోభమెయికల్క్యవతారమునన్ జనార్దనా. 34

భూవలయంబునన్ రిపుల పొంక మడంపగబూని శిష్టులన్
బ్రోవగనాత్మలో దలంచి పుణ్యగుణాన్వితమైన దేవకీ
దేవికి నోముపంటవయి తృప్తిగ నష్టమగర్భమందు దు
ర్భావునింగంసు జంపితివి రాక్షస సంహరణా! జనార్దనా. 35

పాపభయంబు పోయె పరిపాటయిపోయెను దుష్కృతంబిలన్
నీపయి భక్తిపోయెనవినీతులు హెచ్చె ప్రపంచమంతటన్
దాపురమయ్యె వేషములు దండుగఖర్చు ల నంతమాయె నీ
పాపములెల్ల బాపనిను ప్రస్తుతిఁజేసెద నోజనార్దనా. 36

కలియుగమందు మానవులు కష్టపరంపరలందుచుండి కే
వల మవినీతికార్యములు వావినెఱుంగని క్రూరవర్తనల్
సలుపుచు పాపభీతియును సంశయమాత్ర నెఱుంగకుండిరో
కలుషవిదూర! వారికెటుగల్గును మోక్షమిలన్ జనార్దనా 37

ధర్మములంతరించె పరితాపము లత్యధికంబులాయె దు
ష్కర్మలలో మునింగి నినుగానక యెల్లరు మూఢచిత్తులై
నిర్మలమైనబుద్ధిమది నేరక మాయలలోనఁజిక్కి స
త్కర్మలవీడిదుఃఖములఁ గాంచుచునుండిరిలన్ జనార్దనా. 38

విత్తమెకారణంబు పృథివీస్థలి నన్నిటికంచు నెంచి దు
శ్చిత్తులు సర్వపాపముల చిత్తమునందు భయంబులేక తా
మత్తతతోడసల్పి యనుమానమొకింతయు లేక ధాత్రి దు
ర్వృత్తులఁజేయుచుండి రవివేకముతోడుత నోజనార్దనా. 39

పాపదవానలంబును కృపాతతినార్పు శరణ్యమౌగదా
నీపదవారిజంబున జనించిన గంగ భవత్పదాబ్జమే
ప్రాపనినమ్మువారలకు పాపవినాశనమౌటచిత్రమే
తాపసలోకవంద్య భవతాపవిదూర ! హరీ ! జనార్దనా. 40

అవనిసమస్త సంపదల నాదరబుద్ధిని గూర్చి శిష్టులన్
ప్రవిమల నీతిశాలివయి పాలనజేసి దయారసంబునన్
భువి నధికప్రమోదముల పూర్వశుభంబులొసంగు నీదు కే
శవ శుభనామమంత్రమును సంస్తుతిచేసెద నోజనార్దనా. 41

పాయని పాపకర్మల నవద్యకృపన్ పరిమార్చి మించి యా
ప్యాయనరీతి భక్తులకపారశుభంబుల నందజేసి శో
భాయుత దివ్యకామ్యముల భవ్యకృపన్నిడునట్టి నీదు నా
రాయణ నామమంత్రము నహర్నిశమున్ దలతున్ జనార్దనా. 42

సాధుజనైక బుద్ధిగల సజ్జనులన్ భవదీయ సత్కృపన్
శోధనజేసి వారి పరిశుద్ధ మనంబుల నాశ్రయించి యా
రాధనసేయు, భక్తుల నిరంతర కామ్యము లొందజేయు నీ
మాధవ నామమంత్రజపమార్గముఁ జూపుమిలన్ జనార్దనా. 43

సుందరరూప! శౌరి! మధుసూధన! పాహిముకుంద!యంచునిన్
డెందమునన్నుతింతు కరుణింపగ జాలమదేలనయ్య్య సం
క్రందనసన్నుతా నను నిరంతరమున్ కృపఁజూడు నీదుగో
వింద శుభాహ్వయంబును పవిత్రమతిన్ దలతున్ జనార్దనా. 44

సురగణకోటికార్తులకు సూన్వ్రతవాదులకున్ శరణ్యమై
వరలుచులోకమందు ననివార్యఫలంబులనిచ్చి సజ్జనా
దరనుతి పాత్రమౌచు నిరతంబుహితంబు నొసంగి దివ్యమై
వరలెడి విష్ణు నామమును వర్ణనఁజేసెదనో జనార్దనా 45

సురుచిరధర్మయుక్త పరిశుద్ధకళాకలితోన్నత ప్రభా
కరమయి లోకమందున వికాసమెలర్పఁగమౌనికోటికిన్
తెలివయిమౌనిబృందకవిధీజన సంస్తుతి పాత్రమైన భా
సురసుఖదంబునీదు మధుసూదన నామమిలన్ జనార్దనా. 46

పరమమునీంద్ర సిద్ధుల కపారశుభప్రదమై చెలంగి శ్రీ
కరమగు మోక్షసంపదల గ్రాలగజేసి నిరంతరంబు సు
స్థిరమతితో భజింప ఫలసిద్ధి నొసంగు త్రివిక్రమాఖ్య నే
మరకజపింతు నామది నమందముదంబున నోజనార్దనా. 47

ప్రేమచెలంగ భక్తులకభీష్టములన్ నెఱవేర్చి సత్కృపన్
కోమలమై మహావ్యధ లకుంఠకృపన్ బరిమార్చి దివ్యమై
మామకపాపకర్మముల మాయముజేసి చెలంగునట్టి నీ
వామన నామమంత్రమును వర్ణనజేసెద నోజనార్దనా 48

వినయ వివేకశీలమున విశ్వహితంబును గూర్చు నిన్ను నా
మనమున సంస్మరించి సుఖమార్గము నా కొదవంగజేయ స
జ్జననుతపాత్రమై చెలగు చక్కని శ్రీధర నామమంత్రమున్
దినదినమున్ జపించెద మదిన్ ననుగావుము శ్రీజనార్దనా. 49

ఆశనువీడి భక్తసుజనాదరణంబును గల్గినే సదు
ద్దేశముతోడ నిచ్చలుమదిన్ జపియించెద నీదునామమున్
నాశము చేయుమయ్య! భవనాశన! మామకపాపముల్ హృషీ
కేశ శుభాహ్వయంబు నిలకీర్తన చేసెదనోజనార్దనా. 50

అమలసుఖప్రమోద విభవాన్విత దాయకమై మునీశ్వరో
త్తములకు దుర్లభంబగుచు ధర్మపథంబున లోకమందు శ్రీ
కమలజగర్భ సన్నుత సుఖప్రదమైజను పద్మనాభ నా
మమును జపింతు నామది సమస్తవిధంబుల నోజనార్దనా. 51

ఆదరబుద్ధితోడ భవదాశ్రితకోటికి సర్వకామ్యముల్
మోదముమీరఁగూర్చుచును మోక్షమునిచ్చుచు
మానికోటికిన్
వేదములన్ ప్రసిద్ధమయి విశ్వహితంబును గూర్చునీదు దా
మోదర దివ్యనామజపమున్ మదిసల్పెద నోజనార్దనా. 52

హర్షముఁగల్గి మానసమునం దతిభక్తి చెలంగ పావనో
త్కర్ష విలాసవైఖరిని తావకపాద సరోజమందు నా
శీర్షమునుంచి నిత్యమున్ జేయుచు నీ దగుదివ్య పూజ సం
కర్షణ నామమంత్రము సుఖస్థితి నెంచెద నోజనార్దనా. 53

శ్రమలనుబాపి ముక్తికి నజస్రసమమార్గము జూపునట్టి యు
త్తమ సుఖదాయకంబు భవతాపవిదూరమునెంచుభక్తులన్
సమమగురీతినేలి కరుణాకరమై జను వాసుదేవ నా
మమునుజపింతు నామది సమస్త విధంబుల నోజనార్దనా. 54

ద్యుమ్న వివర్జితుండ గుణదోషవిచారణశక్తిపీడి ప్ర
ద్యుమ్నుడవైన నీచరణయోగమె నమ్మితి సద్యశోవియ
న్నిమ్నగమూర్తి నీపదమునీడల నామదినిల్వఁజేసి ప్ర
ద్యుమ్న బలమ్ముఁగూర్పు మమితోదితసత్కృప నోజనార్దనా.

శ్రీయుతమై సమస్త సురసేవితమై యఘనాశనంబునై
పాయనికూర్మి భక్తజన పండిత సత్కవిలోక సన్నుతిన్
ధీయుతరీతి నొప్పి కడుతృప్తినిఁగూర్చి చెలంగునట్టి నీ
శ్రీ యనిరుద్ధ నామము వచించెద భక్తిమెయిన్ జనార్దనా.56

చిత్తమునందు ధర్మపరిశీలనఁ గల్గి నిరంతరంబు స
ర్వోత్తమమై సదాకరుణనొప్పి మునీంద్రులకెల్ల యోగ్యమై
మత్తులనెల్ల సంతతము మర్దనసేయునుగాదె ధాత్రి నీ
యుత్తమమైనయట్టి పురుషోత్తమ నామము శ్రీజనార్దనా. 57

విజయకరంబు సంతతనవీనయశంబయి భక్తితోడుతన్
భజనము సల్పుభక్తుల కపారశుభంబులగూర్చి పాతక
వ్రజమును బాపిమోక్షసుఖవాంఛితముల్ సమకూర్చునీ యధో
క్షజ శుభనామ మంత్రమును సన్నుతిఁజేసెదనోజనార్దనా.58

వినయ వివేక సంజనిత విక్రమ మేర్పడ దుష్టవర్గమున్
ఘనమగురీతి సంహరణ గణ్యతకెక్కఁగఁజేసి లోకమం
దనయము శాంతిగూర్చు విజయప్రదమై జను నారసింహ పా
వన విమలాహ్వయంబు నెద వర్ణనఁజేసెద నోజనార్దనా. 59

పావన కౌస్తుభమార్గమును ప్రాప్తిలజేయగ సంతతంబున
ద్భావముతోడ పాపముల బాయగ దీక్షనుగల్గి నిచ్చలున్
కేవల ధర్మమూర్తివని కీర్తన జేయుచు నచ్యుతాఖ్యనే
భావమునం జపింతు పరిపాలనజేయవె నన్ జనార్దనా. 60

హితమునుగూర్చి లోకము లహీన కృపన్ పరిపాలనంబు శా
శ్వత కరుణావిలాసమున సల్పుచు దుర్జనులన్ వధింపుచున్
స్తుతి నొనరించువారి కడుసొంపుగ నేలు జనార్దనాఖ్యనే
శతకముగూర్చి నిచ్చలును సన్నుతిజేసెద నోజనార్దనా. 61

పాయక సర్వలోకముల భారమునెల్ల వహించి నిత్య శో
భాయుత సత్కృపాన్విత విభాసితరీతి చెలంగి భక్తినా
ప్యాయన మొప్పగొల్వ పరిపాలనజేయు యుపేంద్రనామమున్
పాయని భక్తి గొల్తు పలుభంగుల వీడక నోజనార్దనా. 62

కామితవస్తు సంపదలు గల్గి సుశీలము సజ్జనత్వమున్
ప్రేమయుగౌరవంబిడి యభీష్టతతిన్ సమకూర్తువంచు నే
నేమరుపాటు లేక హరయే యని తావక దివ్యనామమున్
నీమముతో జపింతు కరుణించుము నన్ను హరీ జనార్దనా.

ఆయతబుద్ధి సంపదయు నాదరభావము దైవభక్తియున్
న్యాయమునింగితత్వము మనంబునగల్గిన భక్తకోటులన్
వేయి విధంబులన్ కడుపవిత్రత నేలిన నిన్ మనాన కృ
ష్ణాయ నమోయటంచు ననిశంబు భజించెద నోజనార్దనా. 64

ఆలునుబిడ్డలంచు తమదంచును సర్వముస్వార్థబుద్ధిచే
బాలిశులై ధనంబె కడుపావనమంచు వచించి ప్రీతితో
కాలమువెళ్ళబుచ్చు పలుగాకులకున్ తెలియంగనౌనె నీ
లీల లమోఘసూత్రములు లెక్కకుమిక్కుటముల్ జనార్దనా. 6

ధనమునుగల్గినంతటనె తావకపాదసరోజయుగ్మ మం
దనయము భక్తిలేకను మహత్తర గర్వపరీత చిత్తులై
దినముల బుచ్చుచుండిరి తుదిన్జనుడెంచెడి కర్మనింతయున్
గనుగొనలేక త్రుళ్ళికలికాల మహత్త్వముచే జనార్దనా. 66

నీతియొకింతలేక పలునీచప్రవృత్తుల నాచరించి నీ
పూతపదారవింద పరిపూర్ణ మహత్త్వమెరుంగలేక ధా
త్రీతలమందు మూర్ఖు లతితీవ్రగతిన్ చరియించుచుండి రో
పాతకనాశ ! నీభజనపాలనసేయక నో జనార్దనా. 67

కనికరమింతలేక నధికారమదంబున కళ్ళుగానకన్
మనమున సంశయింపక ననాథులబాధల క్రుంగజేసి తా
ఘనులమటంచుచెప్పికొను ఘాతకులెందరొయీయుగంబు నం
దనయము సంచరించెద రహోనినుసేరక నోజనార్దనా. 68

అంచిత గర్వభావమున నాదరణీయులుగాక దేశమున్
వంచనజేసి ఘోరమగు పాతకముల్ పచరించి యెన్నియో
లంచములన్గ్రహించి సువిలాసగతిన్ చరియించుచున్న యీ
వంచకవర్గ దుష్క్రియల వారణసేయుమిలన్ జనార్దనా. 69

లలిత కళావిలాస బహుళామల కోమల కీర్తిశాలికిన్
తలపఁగ లేమిబాధ సతతంబు మహేంద్ర సమానభోగికిన్
కలుఁగదు విద్యలేశము జగంబు సమస్తము నీ విలాసమై
వెలయుచునుండె సంతతము విశ్వజనావన శ్రీజనార్దనా. 70

గంగను దెచ్చి నీదు పదకంజములం గడుగంగ నెంచనా
గంగయె ... ంబునను కల్మషహీనగ జన్మమె దె పా
లం గడుగంగ నెంచిన నిరంతరవాసము పాలసంద్రమే
భంగినొసర్తు నీదు పదవారిజసేవల నోజనార్దనా. 71

భక్తిని నీదు దివ్యపద పద్మములర్చనఁ జేసి భవ్య స
న్ముక్తిని పొందగోరు సుజనుల్ వినుతింపగ యోగ్యమంచుధీ
శక్తిని నీకృపాతతిని సంస్తవనీయసుపద్యమాల ధీ
యుక్తినొసంగుచుంటినిదియుత్సుకతన్ గొనుమోజనార్దనా. 72

పదములు తొట్రుపాటుపడు ప్రాయముచిన్నది లేవలంకృతుల్
ముదమగుమాటతీరు రసముందగు భావమెటుంగదింత నీ
పదమెశరణ్యమంచు నెదభావనసేయు భవత్కృపాసుసం
పద నెటు పెద్దఁజేసెదవొ మత్కృతికన్యక నోజనార్దనా. 73

కోరదు తుచ్ఛభోగముల కోరదు సంపదలిచ్ఛగల్గి నీ
సారపదాంబుజాతములె సద్గతియంచును నమ్మియుండు స
ద్గారవబుద్ధి నాదుకృతికన్యక చేకొని భవ్యసద్గుణో
దారకృపాకటాక్షమున ధన్యునిఁజేయుమునన్ జనార్దనా. 74

జలజహితుండు రాహువును సప్తమమందున శుక్రుడుచ్ఛయ
దలర ధనుస్సునందు శనియాగురుడున్ బుధుడష్టమంబునన్
చెలువుగ తొమ్మిదింటశశినీచనుభూసుతుడొప్పఁ బుట్టితిన్
వెలయతులాఖ్యలగ్నమున వెల్గగ కేతువు శ్రీజనార్దనా. 75

దండమువాసుదేవ భవతాపవిదూర హరీ రమాధవా
దండము భక్తలోకపరితాపవిదూర ! శుభప్రభావ ! నీ
దండనుఁజేరినాడ నను తావకసత్కృపతోడ నేలు ము
ద్దండభుజాబలప్రథితదానవమర్దన శ్రీజనార్దనా. 76

పూతము మానిలోక జనపూజ్యము కల్మష నాశనమ్ము వి
ఖ్యాతము దీనరక్షణమఘ ప్రజనాశన మార్యసద్గుణో
పేతము భక్తవర్యుల కభీష్ట ఫలప్రదమైన నీ పదా
బ్జాతమె నాకుదిక్కని యజస్రమునమ్మెదనోజనార్దనా. 77

ఓయి మహానుభావ ! పురుషోత్తమ ! దేవ! విపన్నవార! శో
భాయుత దివ్యమూర్తి! కవిపండిత సన్మునిలోక సన్నుతా !
శ్రీయుత శోకనాశక ! సుధీవర నీపదవారిజంబులన్
పాయనిభక్తి గొల్చెదను బాపుము పాపములన్ జనార్దనా. 78

అనఘుని మానిలోకనుతు నార్తశరణ్యునిసజ్జనావనున్
ఘనసుత పావనాంఘ్రియుగు సారసనాభుని శాంతమూర్తి నా
తనుజ వినాశనున్ కవిబుధ ప్రకర స్తవనీయు శ్రీశునిన్
మనమున సంస్మరింతు ననమానగతిన్ సతమోజనార్దనా. 79

స్ఫురిత వికాసకౌస్తుభ విశోభిత వక్షముతోడభవ్యక
స్తురితిలకంబుతో విమల శోభ చెలంగెడి కాంతితో మహా
దరమగు చూపుతోడను సుదర్శన చక్రముతో వెలుంగు నీ
సురుచిర దర్శనంబునిడి జూడుమునన్ కరుణన్ జనార్దనా. 80

ధనమునకై మహోన్నతపథంబునకై యిహలోకకీర్తికై
జననుతికై మహోత్తమ విశాల సుభోగముకై భజించలే
దనయము నిన్ను నామది మహత్తరతావక దివ్యసత్కృపా
జనితభవార్ణవోత్తరణ సాధనకై దలతున్ జనార్దనా. 81

ఘనతరమౌ సుధారసముకంటె రసోన్నత గోఘృతంబుకం
టెనుమహనీయంబు నీదు శుభనిర్మల నామజపంబు దానికం
టెను ఘనమైన సంపదగణింపగ లేదని తామెరుంగకీ
జను లతి కష్టజాలముల సాగుచునుండిరి శ్రీజనార్దనా. 82

పరునకు దుష్టలోక పరిపంధికి పాపచయాంధకార భా
స్కరునకు భక్తలోకజన సంస్తవనీయునకున్ మునీశ్వరో
ద్ధరణునకున్ రమాధవు కుదారునకున్ హరికిన్ గుణాబ్ధికిన్
పరమముదంబుతోడ కృతిభవ్యత నిచ్చెద నోజనార్దనా. 83

అనఘగుణాఢ్యునందు పరమాత్మునియందు రమేశునందు స
జ్జననుతునందు సంతతవిశాల కృపాకరునందు నిత్య పా
వన మునిలోలునందు భగవంతునియందును భక్తిగల్గి నే
ననయము వెల్గుచుందువిజయంబునుగూర్పగనో జనార్దనా. 84

స్నానముఁ జేసి నిష్ఠమెయి సంధ్యలవార్చుచు దీర్థయాత్రలన్
పూనికతోడ సల్పినను పొందునె లేశఫలంబు నీదు స
న్మానిత పాదపద్మముల మానక నిచ్చలు గొల్వకుండ న
జ్ఞానులు దీని నేరక నజస్రము వెగ్గెదరో జనార్దనా. 85

అనయము నీషణ త్రయమునందున మున్గుచు మానవుండు నీ
వినుత పదాబ్జపూజనము వేడుకతోడుత సేయకుండ పా
వనమగు దారిఁగానక భవంబున మున్గుచుఁ దేలుచుండె నీ
సునిశిత దివ్యసత్కృపను జూపుము మార్గము నో జనార్దనా. 86

సంతతమిట్టిరీతి భవసాగరమందు మునుంగు మమ్ము నీ
శాంతకటాక్ష వీక్షణల చక్కఁగ ధన్యులఁ జేసి భవ్యభా
స్వంతకటాక్ష వీక్షణల సాకుచు మోక్షపథంబు జూపి మా
చింతలనెల్ల బాపవె ! విశిష్టగుణాకర శ్రీ జనార్దనా. 87

వందనమార్యసన్నుత ! శుభస్థితిదాయక ! తార్క్ష్యవాహనా
వందనమబ్జనేత్ర ! సురవందిత ! కామ్యఫల ప్రదాయకా
వందనమార్త రక్షక ! శుభాకర ! శ్రీశ ! యశోవిలాస ! గో
వింద! పురాణపూరుష! రవిప్రభ తేజ! హరీ! జనార్దనా. 88

బానిసతాచునాశకు కృపాకర నీపదవారిజంబులన్
పూనిక తోడగొల్వక నపూర్వసుఖంబులటంచు నైహిక
ధ్యానములందు మున్గి పరితాపమునొందెడి మానవాళినీ
ధ్యానముచేత నిచ్చలును ధన్యులఁ జేయవె శ్రీ జనార్దనా. 89

వాసిగతీర్థయాత్ర లుపవాసములెన్నియొ చేయలాభమే
భాసితమైన నీదు పదభక్తిని నిశ్చల మానసంబునన్
దోసిలియొగ్గియున్న భవదుర్భరబాధలు బాయకున్న తా
గ్రాసముకై సుజీవితము గ్రాలగ జేసెదరో జనార్దనా. 90

సకల జనాభిమానమును సంతత కీర్తియు వైకమత్యమున్
ప్రకటవిలాస భక్తిగల భావము నిర్మల జీవితంబు కో
రక తమ స్వార్థచింతకయి రాజిలుచుండిన మానవాళికిన్
సకల చరాచరాత్మక విశాలమనంబిడు మోజనార్దనా. 91

హరిచరణాంబుజంబుల నహర్నిశముం గలియంచు భవ్యసు
స్థిరములటంచెరింగి జగతింగల సౌఖ్యము లస్థిరంబులం
చెరిగియు మానవాళి పరమేశ్వరుమాయకు లొంగినారు నీ
సురుచిర భవ్య సత్కృపను జూపుము మార్గమునో! జనార్దనా.

బోధనచేసి గీతపరిపూర్ణ ముదంబున నానరున్ మహా
సాధువుగానొనర్చితివి సారములెన్నియొ చెప్పిచెప్పి నీ
బోధనం బొందు క్రీడి పరిపూర్ణుడు ధన్యుడు మాకుకూడ నీ
బోధనలోని పద్ధతుల పూర్ణతగూర్పుము శ్రీజనార్దనా. 93

చదువుల నెన్నినేర్చినను శాస్త్రములెన్నిపరీక్ష సేసినన్
ముదమును తావకీన జనమోద మహత్త్వము నెన్నశక్యమే
సదమల భావసంపదను సాధనజేసెడి మార్గమేదొ మా
కొదవగ జేయుమయ్య! సుజనోద్ధరణా! హరి శ్రీజనార్దనా. 94

గౌతమగోత్ర సంభవుడ కల్పన చేసితి పద్యమాల నీ
పూత పదార విందముల పూజనొనర్పగ నిట్టిరీతి సం
పూత విశేష గ్రంథము లపూర్వగతిన్ విరచించు శక్తినో
పాతకనాశ ! నాకిడి కృపన్ దగనేలుము శ్రీ జనార్దనా. 100

మంగళమూర్తి రక్షక రమాధవ సజ్జనలోక సన్నుతా
మంగళ మబ్జనాభ ! గుణమండన ! చారుకటాక్షయుక్తిచే
మంగళ సౌఖ్య సంపదల మాకొనగూర్చి కృపాబ్ధినేలు మా
మంగళరీతి నభ్యుదయ మార్గముజూపి కృపన్ జనార్దనా. 101

# గద్య

ఇది శ్రీ శారదా వరప్రసాదలబ్ధ కవితాలంకృత గౌతమ
సగోత్ర పవిత్ర బులుసు కుల కలశ పాథోరాశి కైరవమిత్ర
బుచ్చన్న పౌత్ర నరసింహశాస్త్రి పుత్ర లక్ష్మీనరస
మాంబాగర్భ శుక్తిముక్తాఫల అష్టావధానా
శుకవితా విలాస వేంకటరామమూర్తి శర్మ
కృత జనార్దన శతకము.
సర్వము సంపూర్ణము
స్వస్త్యస్తు
మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ